# విషయసూచిక

# ప్రబోధము

[అనుముల వేంకటశేషకవిగారు]

గీ. ఇతరులె, "ఇటాలియన్ ఆఫ్ దియీస్ట్" అటంచు
ముద్దుసూపఁగ మోహంపు మొలకయైన
స్వీయ భాషను, విడనాడి వేఱుభాష
కట్టు సాచెద వేలరో? వెఱ్ఱియాంధ్ర!

క. పొరుగింట పుల్లకూరయె
మురిపెంబిడుననియొ? యదియె ముఖ్యము సంప
త్కరమనియో? యేమనియో?
పరభాషయె చదివె దది విఫలమె యాంధ్రా!

సీ. ఒకనాటి సుఖముకై యొసలమ్ము కొనుటది
క్షణికమే గాని శాశ్వతము గాదు;
యెంత కష్టించిన నేనియు స్వీయ భా
షల నబ్బు గౌరవం బలరఁబోదు;
పరభాష యనెడి సంబరమె కాని తదీయ
వ్యయభార మింతంత యనఁగరాదు;
వాడు నాటికిని యన్యాయముంబె కడకొక్క
యల్పుని యాచారమైన లేదు;

తవిలిన న్నాళ్ళు బాసిన తనమె చావు
గడచునైన స్వతంత్రంబు కానరాదు;
ఏమి సుఖమని పరభాష కేగెదీవు?
చాలు! నికనైన నీవృత్తి జరుపు మాంధ్ర!

ఉ. అన్నము సున్న జేసి, సుఖ
మన్నది గంగను గల్పి, నిద్ర రా
మన్నను మాని, నీరయిన
నొక్కెడ గ్రుక్కెడు లేక యాంధ్ర భా
షోన్నతికై కృషిన్ సలుపు
నుత్తముఁ డొక్కఁడె యాంధ్రుఁడన్న; లే
కున్నను వాని జన్మమిఁక
నుండి ప్రయోజనమేమి యాంధ్రుఁడా!

సీ. నీభాషలో గ్రంథ నిలయమ్ముఁ బాడఁగన్నఁ
జేసైన సాయమ్ముఁ జేయవలయు;
నీభాషలో పుస్తకాభావమైన నే
దేనియుఁ బూని రచింపవలయు;
నీభాషలోఁ గవి—నినుఁ గాంచవచ్చిన—
యెదురేగి కడుగౌరవింపవలయు;
నీభాషలోఁ బత్రికా భూషణం బేది
యుండిన నభిమాన ముంపవలయు;

నీకులాచారమిది—యిది నీదు భాష
యనిన యంతన చెవిఁ గోసికొనఁగ వలయు;
సంఘమునకయి ప్రాణంబు సైతమీయఁ
దలచు నంతటి పట్టు గావలయు నాంధ్ర!



# పత్రికాస్వీకారము

**4** సత్యాగ్రహి

ఇదియొక వారపత్రిక. ఏలూరు నుండి వెలువడుచున్నది. తొలుదొలుత నీ పత్రిక "పల్లెటూరు" అనుపేర శనివారపు సుబ్బారావుగారి సంపాదకత్వమున నిడదవోలునుండి బయలుదేరినది. పల్లెటూరు పట్టణవాసమున కేగినప్పుడనే సత్యాగ్రహి అయినది. సంపాదకులు మారినప్పుడనే నామ రూపములు కూడ మారినవి. దీని సంపాదకులు ఆత్మకూరి గోవిందాచార్యులు శ్రీకృష్ణ జన్మస్థానమున కేగుటయు అచ్చటవారి అస్వస్థతయు వారి కార్యదీక్షయు ఆంధ్రలోకవిదితములే! స్వరాజ్య వాదుల పక్షమున మాపురమున కొంతకాలము ప్రకటింపబడిన భమిడిపాటి సత్యనారాయణగారి స్వతంత్ర లేఖావాత సంతతీవ్రముగ వ్రాయు పత్రిక ఇదియు. కాని స్వతంత్రుని మాదిరి ఆచార్యులుగారు హాస్యప్రియులు గాకుందురుగాత. సంవత్సరచందా రు **4—0—0** లు వలయువారు ఆత్మకూరి గోవిందాచార్యులుగారు సంపాదకులు సత్యాగ్రహి, ఏలూరు పశ్చిమగోదావరిజిల్లా అని వ్రాసిన బడయగలరు.

**5** ఆంధ్రరాష్ట్రము

మా మిత్రులు శ్రీవత్సవాయి రాయజగపతి వర్మగారు దీనికి సంపాదకులు. ఇది మా రాజమహేంద్రవరము నుండియే వారమున కొకసారి వెలువడుచున్నది. శ్రీవర్మగారొక గ్రంథమాలను స్థాపించియు "జగపతి" పేరట నొక పత్రికను ప్రకటించియు కొంతకాలము భాషాసేవ చేసియున్నారు. పెద్దాపుర సంస్థానచరిత్రమును తొలుత వ్రాసినది వీరే.

స్వరాజ్యపార్టీ వారికి ఆంధ్ర"స్వరాజ్య" పత్రికయు జస్టిసుపక్షమువారికి "సమదర్శిని" పత్రికయు ఎలక్షను అల్లరిలో ప్రచారము సలుపుచుండ నేమమతాల దీనిని ప్రారంభించి యుద్ధోచితపక్షమునకు ప్రచారము చేయు పత్రిక లేదను కొరతను మా మిత్రులు దీర్చిరి. తమ మామ మోచర్ల రామచంద్రరావు పంతులుగారి కొఱకు అడివి శంకరరావుగారి పత్రికాప్రకటనము నందు శ్రీవర్మగారికన్న వేయిరెట్లెక్కువ శ్రద్ధ తీసికొనుచుండ నుండరనియు, స్వరాజ్యపార్టీవారు నిరసించిన కొలదిని పెచ్చేది మోచర్ల రామచంద్రరావు పంతులుగారి గౌరవము. జస్టిసు పక్షావలంబులు అనుకూలముగ ప్రచారము సలిపిన కొలది క్షీణింపగలదనియు మా మతము.

పత్రికకు ఆంధ్రరాష్ట్రమని పేరిడుటచే నీఎన్నికల అనంతరము కొదువ పత్రికలమాదిరి నాగిపోక తనధోరణను మార్చి ఆంధ్రులకు ప్రత్యేకరాష్ట్రము వచ్చువఱకైయినను సక్రమాందోళనము సలిపి తననామము సార్థకము గావించుకొనుగాత. వలయువారు, ఆంధ్రరాష్ట్రము రాజమహేంద్రవరము తూర్పుగోదావరిజిల్లా అని వ్రాయవలెను, సంవత్సరచందా రు **4** లు.

# శ్రీమాన్ బహుజనపల్లి సీతారామాచార్యులవారి జీవితము

[నిడుదవోలు వేంకటరమణగారు బి. ఏ.]

(గతసంచికానుబంధము)

బ్రౌణ్యనిఘంటు:—ఇది యాంధ్రులందఱు నాచంద్రార్కముగ తన నామమును స్మరించునట్లు, నిరుపమానమగు భాషాసేవ నొనరించిన ఛార్లెసుఫిలిప్పుబ్రౌను ( Charles Phillip Brown ) దొరవారిచే రచియింపఁబడి క్రీ. శ. 1852 సంవత్సరమునఁ బ్రకటింపఁబడినది. ఈ దొరవారు తెలుఁగునకు నింగ్లీషును నింగ్లీషునకుఁ దెలుఁగును రెండు విధములుగ నీ నిఘంటువులను రచించినారు. ఇంతియకాక వీరనేకాపూర్వాంధ్ర గ్రంథములు సంపాదన మొనర్చి, సుప్రసిద్ధ కావ్యములకుఁ డీకలు వ్రాయించి బహుభాషావేదులై విలసిల్లిరి. వీరి నిఘంటువులో తత్సమతద్భవాది పదములే కాక, వ్యావహారిక భాషాపదములు నన్యదేశభాషాపదములు గూడ నిచ్చియున్నారు. దీని నేఁడుగూడ మనవా రుపయోగించు చున్నారు.

దీని తరువాతిది చిన్నయసూరిగారి యక్షరగుచ్ఛము (చిన్నయసూరిగారి యసంపూర్ణ నిఘంటువులోని భాగములు తరువాత సీతారామాచార్యులుగారు మొదలగు పండితు లచ్చువేయించిరి. వానికే యక్షరగుచ్ఛములని పేరు)

సీతారామాచార్యులువారు నిఘంటువు రచించు నాఁటికిఁ గల తెలుఁగు నిఘంటువు లివియు. కాని పద్య నిఘంటువులలోఁ గొన్ని నాఁ డెఱుంగనే యెఱుంగరు. అది క్రీ. శ. 1867 సంవత్సరము. ఆకాలమున నిప్పటివలె ప్రభుత్వమువారు గ్రంథ సంపాదనమునకై పండితుల నంపి, యాగ్రంథములఁ బ్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమునఁ ( The Government Oriental Manuscript Library ) జేర్చలేదు. ఇప్పటివలె ప్రాచీన వస్తు పరిశోధన మప్పుడు జరుగలేదు. ఇన్ని ప్రాచీన గ్రంథములు బయలు వెడలలేదు. ఇన్ని సౌకర్యములా కాలమున లేకపోయినవి. గ్రంథసంపాదనమునకై యాచార్యులవారెంత శ్రమపడినది యాచార్యులవారే తమ నిఘంటువుపీఠికలో నుదాహరించినారు. కాని యిచ్చట నొక్కమాటమాత్రము చెప్పవలసియున్నది. ఆచార్యులవారి నిఘంటువున లేని కొంత పదజాలముం బట్టియు, వారు కొంతమంది తెలుఁగు కవులకు నిరూపించిన స్థానములను బట్టియు, వారు తమకు ముందుఁగల నిఘంటుకర్తల సాహాయ్యముచేతనే తమ నిఘంటువు రచించినట్లును,

వారు స్వతంత్రముగ, తమకు ముందుఁగల నిఘంటుకర్తలు చదువని తెలుఁగు కావ్యములఁ జదివి, వాని నుపయోగింప లేదనియు స్పష్టముగాక మానదు. ఇందులకుదాహరణముగ శైవకవుల గ్రంథములు మనము తీసికొనవచ్చును. తెలుఁగుదేశపు శైవకవులలో నగ్రగణ్యుండును, దక్షిణహిందూదేశమున జన్మించిన సుప్రసిద్ధ శైవకవులలో నొకఁడును నగు పాల్కురికి సోమనారాధ్యుని గ్రంథములఁ గొన్ని వీ రుదహరించియు, నీకవిని నైదవతరగతి క్రిందఁ జేర్చి, తమ పరిశీలనాశక్తి వెల్లడించినారు. ఈకవి రచించినఁ బండితారాధ్యచరితమునందును, బసవపురాణమునందును నాచార్యులవారి నిఘంటువున లేనివి పదములు వందలుండును. దీనిఁబట్టి చూడ, యీగ్రంథము లాకాలమున గూడ నున్నను నాచార్యులవా రిదివఱకు నిఘంటుకర్తలు వ్రాసిన పదములనే సాధ్యమైనంతవరకుఁ దీసికొని వానిఁ గూర్చి మతి యేమియుఁ జేసినారు కారు.

అంతమాత్రమునచే నాచార్యులవారు చేసిన దేమియుఁ జెప్ప నవసరము లేదని యనుకొనుట పొరపాటు. ఆచార్యులవారు తమకు ముందుఁ గల నిఘంటువులకు మెఱుఁగు పెట్టినట్లు తమనిఘంటువును రచించిరి. కావున వారుచేసినది ఘనకార్యమనుటకు సందియము లేదు.

శబ్దరత్నాకరము నేఁడు మనకుఁగలిగిన నిఘంటువు లన్నిటిలోను మేలైనదియైనను, దినదినాభివృద్ధిఁ గాంచుచున్న భాషాతత్త్వవిచారణగల మనభాషకు నది తోడ్పడఁజాలకున్నది. పలయునఁ దొల్లింటివలె గాక నేఁడు మనవారిలోఁ గొందఱు భాషాతత్త్వజిజ్ఞాసాపరాయణులై యున్నారు. శబ్దరత్నాకరమునందు, శబ్దవ్యుత్పత్తులు గాని, ఆశబ్దమే ధాతువునుండి జనించినదో యట్టివిషయములు గాని, తెలుఁగునకును, తుల్యప్రభవములగు ద్రావిడాది భాషలతో నెట్టిసంబంధమున్నదో యెఱుంగుటకుఁ గాని, సామగ్రి లేదు. నేఁడు వెలువడుచున్న ప్రాచీనకావ్యములలో నున్న యనేక పదములందు లేవు. ఒకవేళ నచ్చటనైన నున్నను దానికి విపరీతార్థము నిచ్చుచుండును. కావున శబ్దరత్నాకరము పైయుట్టపై నాంగ్లేయభాషలో (Sabda Ratnakaram A Comprehensive Telugu Dictionary) అయియున్నను, దినాభివృద్ధిగాంచుచున్న నేఁటి మన భాషావాఙ్మయ వ్యవస్థలకు మాత్రమిది యెంతమాత్రము సమగ్రమగు నిఘంటువు కాదనుమాట నిశ్చయము.

సీతారామాచార్యుల వారి నిఘంటువు వెలువడిన వెనుక కొన్ని యచ్చుతెలుగుపదముల నిఘంటువులు బయలువెడలినవి. వానిలో, శేషగిరిరాల జగన్నాథకవి

గారిచేతను గురుజాడ శ్రీరామమూర్తి పంతులుగారిచేతను రచియింపఁబడిన ఆంధ్ర పదపారిజాతమును, శ్రీ కొట్ర లక్ష్మీనారాయణశాస్త్రులవారిచే రచియింపఁబడిన లక్ష్మీనారాయణీయ మను శుద్ధాంధ్రపర్యాయపద నిఘంటువును ముఖ్యముగాఁ జెప్పఁదగినవి. ఇవియైనను గొన్ని నూతనములగు పదములనే యొసంగునుగాని యంతకంటె భాషాతత్త్వశాస్త్రజ్ఞుల కుపయోగింపనేరవు. ఇవియేకాక బ్రహ్మశ్రీ మహాకాళి సుబ్బారాయఁడుగారు రచించిన శబ్దార్థచంద్రికయు, పాలూరి శంకరనారాయణశ్రేష్ఠిగారు రచించిన యాంధ్రాంగ్లేయభాషానిఘంటువులును దేశమునం దున్నవి.

ఇన్ని నిఘంటువులున్నను, ప్రమాణమగు నిఘంటువు నేఁడు మనకుఁ గలిగినది సీతారామాచార్యులవారి నిఘంటువే యనుట చర్వితచర్వణమగును.

పై నిఘంటువులలోని లోపములను నివారించి నూతనభాషావాఙ్మయవ్యవస్థలకుఁ దోడ్పడెడు సమగ్రమగు నొక బృహదాంధ్రనిఘంటువును 'శ్రీ సూర్యారాయాంధ్రనిఘంటువు' అను పేరిట నభినవాంధ్రభోజులనఁబరఁగిన శ్రీ పీఠికాపురాధీశ్వరులు రచియింపించ నిప్పటి కేడెనిమిదియేండ్లక్రిందనే ప్రారంభించినారఁట. కాని యింతవఱకు నొక్కసంపుటమైన వెలువడలేదు. అట్టి విపులాంధ్రనిఘంటు వాంధ్రులకు లభించు భాగ్యమెన్నఁడు కలుగునో గదా!



# అన్నవరము

# శ్రీ సత్యనారాయణస్తవము

## పంచరత్నములు

శా. సారేజాసన పాకశాసన ముఖుల్ నీతత్త్వముం గానఁగా
లేరన్నన్, మతిమూఢమానసుఁడ నేలీలం గనుంగొందు? ది
వ్యారీతి న్మతి నిల్పనేర్తు? కృప నన్వీక్షింపవే? నానమ
స్కారంబుల్ గయికొమ్ము రత్నగిరివాసా! సత్యనారాయణా!

మ. భవదీయంబగు దివ్యరూప మెద నిర్వ్యాజాంగాఁ గాలేని మా
నవులం గేవల ముద్ధరింపఁ జగతిన్ బ్రత్యక్ష రూపంబుతో
నవతారించితి రత్నశైలమున? నీ వత్యంత దీనావనో
త్సవ సంసక్తుఁడవంచు నెన్నఁదగుఁ గాదా! సత్యనారాయణా?

శా. సామాన్యంబగు కొండకాల్వ శుచితా సంపూర్ణ పాపానదీ!
నామం బందెను, ఘోర జంతు తతికిన్ గంద్రాలకు న్నాండ్లకున్
దాముంబౌ నొకగుట్ట రత్నగిరి నా ధాత్రి న్విరాజిల్లెసెన్
నీమాహాత్మ్యముబట్టి? యెన్నఁదగదే? నిన్ సత్యనారాయణా?

మ. కలికాలంబు బలంబు పెంపు నను గం°స్గల్పి సత్కర్మముల్
పొలియంజేసి స్వధర్మముల్! చెడఁజేసి యీ లోకంబు చేకొంచు దు
ర్బలులౌ వారికిఁ దగ్గ పుణ్య సులభోపాయంబుగా నీవ్రతం
బలరం జేసితిగాదె? రత్నగిరివాసా! సత్యనారాయణా?

మ. శతయాగంబు లొనర్చి, నిర్మల తపశ్చర్యాదులన్ జేసి సం
తత దానంబులు సల్పి, నీతుములఁ జొందం జాలఁగా లేని శా
శ్వత పుణ్యం బౌకటం గడింపఁబడు? సుశ్రద్ధాదుల న్గూడి నీ
వ్రతముం జేసిన యంతమాత్రమున దేవా! సత్యనారాయణా?

—కేతవరపు వేంకటశాస్త్రి

## ఋతుమాల

[జూలూరి తులశమ్మగారు]

(గతపందికాబంధము)

కానొనంగిన కనరూప ధనము, మకల
గ్రైకొనుటకేమి కమలను గనుటకేమి
చండతరవర్తి ప్రచుర మార్తాండమూర్తి
[illegible]గల వేయికరములఁ దరిమి సాచి.

గ్రైకొవంబూని తనసొత్తు కరుణమాలి
నరాలు లోగుందె నదములు నల్లవారె
నరసులును దీర్ఘికలుగూడ సన్నమయ్యె
ఓషధులు పల్లవశర్యా వంతోషముగను.

# పింగళి సూరనార్యుడు

## 1వ ప్రకరణము

[చిలుకూరి నారాయణరావుగారు ఎం. ఏ. ఎల్. టి.]

లోకమున నాకాశ కుసుమ మన నట్టిదియో యాంధ్రమున ద్వ్యర్థికావ్యమన నట్టిదియై యుండ దానిని వాస్తవమైన దానిగా నొనర్చిన సూరనార్యుని కన్న శ్లాఘాపాత్రుడు వేఱొకడుండడు. కృష్ణామండలములోని పింగళిగ్రామము కవిపూర్వులకు చిరకాలము నివాసమగుటం బట్టి కవి వంశ నామము పింగళివారని బడెను. పండిత సాంప్రదాయమైన పింగళి వంశము కృష్ణాగోదావరీ పరిసర ప్రదేశముల వ్యాపించినది. పింగళి గాదనరామయ మంత్రు లీవంశములోనివారలే. వీరందరకును పింగళి గోంకనామాత్యుడు మూలపురుషుడు. ఈ క్రింది పద్యమును పింగళి రామనమంత్రి తంగెడకొండని దిట్టుచు వ్రాసెనని యప్పకవి యుదాహరించెను.

ఉ. పింగళి యేకవక్త్రపురి
వెంపరగ నందు వసించుచున్న యా
తంగడకొండడే బకుఁడు
తిథ్యము మానవులార వాని బా
ధం గడతేర్పగా దె మును
ధర్మజు తమ్ముడు భీము డిప్పు డీ
యొంగిలి ముప్పజంపుటకు
నిప్పుడు వేమడు భీము డయ్యెడున్॥

ఇట్టి పింగళి వంశ వృక్షము నుండి మన కవిచే నలంకృతమైన యొకశాఖ కవి తండ్రియైన యమరనామాత్యునినాడు గాని యంతకు బూర్వమున గాని విజయనగర ప్రాంతమున వ్యాపించినది. పింగళి సూరకవి యమరనసచివు మువ్వురు పుత్రులలోను జ్యేష్ఠుఁడు. ఈతఁడు క్రీ. శ. 1500 సంవత్సర ప్రాంతమున జనించినట్లూహించ దగియున్నది. ఈతని కాపురము విజయనగరముగాని దాని సమీపమున నేదో గ్రామముగాని యై యుండును. ఏది కాపురమైనను నీతని తండ్రి విజయనగర ప్రభువైన కృష్ణరాయుల కాశ్రితుఁడై యాతఁడొసగిన యగ్రహారము వలన జీవించుచుండునట్లీ క్రింది పద్యము వలన గానవచ్చుచున్నది.

క. పృథులాశాశీసేతు
ప్రథానుమహాహారి కృష్ణరాయసముద్ర
ప్రథితాగ్రహార భోగా
తిథేయ నిజసంతతి పతీతాత్మునకున్॥

సూరకవి యల్లసానిపెద్దన మనమరాలికి భర్తయైనట్లు జన పరంపరగ వచ్చు వాడుక గలదు. కాని, పెద్దన నందవరీకనియోగి. సూరన యారువేల నియోగి.

ఇట్టి శాఖాభేద మున్నను గొన్ని ప్రదేశముల సంబంధ బాంధవ్యము లొనర్చుకొను వాడుక కలదు. గాన నీసంగతి నిజమై యుండవచ్చును. పెద్దన మనుచరిత్రమును రచించు కాలమున నిక్కవి ప్రారంభ దశలో పూర్వపు వాడుక ప్రకారము గారుడ పురాణము నాంధ్రీకరించి యుండును. పెద్దన యాంధ్రభాషయం దవివఱకు వాడుకలోనున్న సంస్కృతమునుండి మొద్ది యే నొక పురాణమునుగాని కావ్యమునుగాని తెనుగించు పద్ధతిని మాని మొదట మను చరిత్రమను ప్రబంధమును స్వకల్పనలతో రచియించి యిటీవలి కవులకు నూతనమైన మార్గమును గనపఱచెను. అతని కాయూహ శృంగారనైషధమును జూచినపుడుని లోకోపకారమునకై యుదయించె నని యూహించెదను. పెద్దన గనుంగొనిన మార్గమునకన్న మిగుల నపురూపమైన మార్గమును భాషయందు గనుంగొని యంతకన్న నెక్కుడు ఖ్యాతి నందనెంచి యీ సూరకవి రాఘవపాండవీయ కృతి నారంభించెను. జనుల వాడుకను బట్టి చూడగా రాఘవపాండవీయము పెద్దన జీవించియుండినపుడె ముగింపబడినట్లు కనపడుచున్నది. కృష్ణదేవరాయుల యనంతరమునను గాని రాఘవపాండవీయము పరిసమాప్తియైనది కాదు. కాబట్టి యీతనిపేరు రాయలవారి యాస్థానమునకు వచ్చియుండలేదు. రాఘవపాండవీయము 1545 సంవత్సర ప్రాంతమున రచియింపఁబడియుండును. అంతకు మున్న రచియింపఁబడిన గారుడపురాణము లేహేతువుచేతనో యిపుడు గానరాదు.

సూరకవి విజయనగరమున నుండిన కాలముననే కొండవీడు నందియాల మొదలయిన చిన్న సంస్థానముల కధీశులయిన రాజులయొక్క పరిచయమును గావించుకొనియుండును. అళియరామరాజు రామభద్రకవి రామరాజభూషణుడు తెనాల రామలింగమును నీతనికి సమకాలికులు.

కృష్ణరాయుల యాస్థానమునగాని తదనంతరాగతులయిన విజయనగరాధీశుల యాస్థానమునగాని సూరకవికి ప్రవేశము లేకుండుటకు కారణము లేకపోలేదు. కృష్ణరాయుల కాలమున నీతడు కేవల బాలుడుగాకపోయినను నూతనకవి. ఆస్థాన కవులతోపాటు రాజసభ కరుగుచుండినను నంత ప్రసిద్ధి కెక్క నంతటి సామర్థ్య మీతని కప్పటికి గుదిరియుండదు.

అచ్యుతదేవరాయులు విద్యాభిరుచిగలిగి కవుల నాదరించి కృతుల నందినట్లు గానరాదు. ఒకవేళ నాదరించినను కృష్ణరాయులవలె వారితో నంత గోష్ఠిగలిగి యుండలేదు. రామరాజు కాలమున నాంధ్రభాషకు ప్రోత్సాహము కృష్ణరాయుల కాలమున నంత విశేషముగా లేకపోయినను నచ్యుతదేవరాయుల కాలమున

కన్న నధికముగ నుండెను. ఈతని కాలములోనే తనయన్న క్రౌర్యమున కడలి గోలకొండనుండి పాఱివచ్చి విజయనగరమున మహమ్మద్ యిబ్రహీమ్‌షా యను మ్లేచ్ఛప్రభువు శరణు జొచ్చెను. ఈతఁడు దన యన్న యనంతరమున గోలకొండ రాజ్యమున కధిపతియైన పిమ్మట నాంధ్రభాష యందభిమానము గలవాడై తెనుగు కృతులనంది తెనుగు కవుల నాదరించెను. ఈ హేతువును బట్టి చూడగా రామరాజు కాలమున గొంతమట్టుకు నాంధ్రభాషకు ప్రోత్సాహము గలిగి యుండెనని యూహింపవచ్చును. ఈతఁడు కృష్ణరాయని యంతటి వైదుష్యమును గలిగి యాంధ్రభాష యందంతటి యభిరుచిగలవాడు గాకపోవుటంబట్టి యితని ప్రోత్సాహమంత ప్రసిద్ధి కెక్కలేదు. ఇదియునుంగాక రామరాజు రామరాజభూషణు నెడ నత్యంతాదరము గలిగి యాగ్రగణ్యుం జేయుటచేత కవిరామభద్రుడు సూరకవి మొదలయిన కవులీర్ష్యాపరులై యాస్థానమున కెడమై యుందురు. ఈ హేతువును బట్టియే ద్వేషపరుడైన రామరాజభూషణునితో మచ్చరించి కవిరామభద్రుఁడు బన్నిదము వైచి గెలిచి తన కతని యుష్ణీషమును సభలో దన్నెనని చెప్పుదురు. ఇట్టి వైషమ్యములను బట్టియే కవిరామభద్రాదులు తమ కావ్యములను విజయనగరమును విడిచిపోయి యితర రాజులకు కృతుల నొసంగిరి.

మొదటినుండియు సూరకవి స్వభావముచేతనే లోకజ్ఞతగల కవియెగాని రాయలవారి యనంతరమున నితఁడు విచారించి చూడగా నేదో గొప్పరాజకీయోద్యోగమున విజయనగరమునుండి వెడలి యాకువీడు నంద్యాల మొదలయినచోట్ల గుదిరి యుండి ప్రబంధములను రచియించియుండును. కాబట్టియే యితఁడు గేవలకవిత్వమూలమున ధనార్జన నొనరింప నవసరము లేనివాడయి యుండెను. దాని నీక్రిందిపద్యము గొంతమట్టుకు స్థాపించుచున్నది.

ఉ. దక్షతయింతగల్గి విశ
దంబుగ గాంచియె నీమదింపలా
పేక్షణమంబు గామినిది
యిట్లనఁగొంకెద నీకునోలలా
క్షేపణభక్తిశీల రచి
యించుట యుక్తమెకాదె శ్రీవిరూ
పాక్షున కంకితంబుగ
శుభార్థము రాఘవపాండవీయమున్

రాఘవపాండవీయము

ఇట్లు రాఘవపాండవీయకృతికి ప్రోత్సాహకర్తయైన యాకువీటి పెదవెంకటాద్రి తన్ను గూర్చి పలికినట్లు సూరకవి తెలియఁజేసియున్నాడు. అదివఱ కాంధ్రభాషయందు ద్వ్యర్థికావ్య మపూర్వమై యుండ నట్టి కావ్యరచనయందు ప్రోత్సాహించుచు నీ పెదవెంకటాద్రి ద్రవ్యసహాయము గూడ గావించి గ్రంథపూర్తియైన

పిమ్మటఁ గవి యభిమతి మెఱిఁగి యనేక విధముల సత్కరించి విరూపాక్షస్వామి కంకితము జేయు మనియెను. కాబట్టియె కవి యీక్రింది పద్యము చేత దన విశ్వాసమును దెలియ జేసెను.

గీ. ప్రభుప్రసత్కారబుణమింతదీరునవియు
శ్రీవిరూపాక్ష సేవా విశేషమనియు
సుజనులిందుగుణాంశంబమాత్రకనియు
తలపితినసాధ్యకృతికిట్లు సాహసంబు

రాఘవపాండవీయము

పై పద్యము వలన గవి కేవల ద్రవ్యాపేక్షఁగాక భగవద్భక్తి పరాయణుఁడై భాషోపకార బుద్ధితో నుండెనని తెలియ వచ్చుచున్నది. ఇదియునుంగాక కవివంశమే పండిత సాంప్రదాయమై పితృదేవతాభక్తి పరాయణమై పారమార్థిక చింత గలిగినది. ఈతని తమ్ముఁడైన యత్రన యనేక పుణ్యస్థలములం దర్శించి యందందు పిండోదకము లిడి పితృతర్పణము నొనరించె నని యీక్రింది పద్యము చెప్పుచున్నది.

మ. గయలో గాశి ప్రయాగ శ్రీగిరిని
గంగాద్వార నీలాచలో
జ్జయినిన్ ద్వారకలోనయోధ్యమధురం
సంస్తుత్య పుణ్యస్థలా
గ్రియుతన్ వెండియుమించునైమిశకురు
క్షేత్రాదులన్ దర్పణ
క్రియచే నాపినతమ్ముఁడెల్లన యయిన
రైప్ద్రాద్రి శాఖ్లోవనమున్

సూరకవి కేవల పితృపూజనైక బుద్ధిచే ప్రభావతీ ప్రద్యుమ్నమును దన తండ్రి కంకితము నొనరించెను. కవియొక్క లౌకికానుభవమును శాస్త్రముల యందుగల జ్ఞానమును రాఘవపాండవీయ ప్రభావతీప్రద్యుమ్నములం గార్యనిర్వాహణోచితములైన యుపాయములం దెల్పు భాగములును నీతియోగ శాస్త్రీయ విషయమై కళాపూర్ణోదయములో నచ్చటచ్చట జొప్పింపబడిన యంశములును దెలియజేయుచున్నవి. కళాపూర్ణోదయమును 1560 సంవత్సర ప్రాంతమునను ప్రభావతీ ప్రద్యుమ్నమున 1565 సంవత్సరమునను నీతఁడు రచియించె నట్లూహించవచ్చును. పిమ్మట నెంత కాలము జీవించి యుండెనో తెలియదు.

---

# పింగళి సూరనార్యుడు

## 2వ ప్రకరణము

సూరకవి రాఘవపాండవీయమును రచియింపకమునుపు గరుడపురాణాదులగు కొన్ని గ్రంథములను రచియించినట్లును గరుడపురాణము నన్నయాదులచే రచియింపబడిన భాగవతాది గ్రంథమువలె సంస్కృత మూలగ్రంథమునుండి యాంధ్రీకరింపఁబడినది యైనట్లును నిదివఱకే తెలియఁజేసి యున్నాను. రంగరాట్ఛందమున సూరకవిరచియించిన గిరిజాకళ్యాణములోనిదని యీ క్రిందిపద్యమును దాహరించెను.

క. కోపాటోపంబున ధర
ణీపాలకచంద్రముడు మునిశిఖామణులం
ద్రోపించినవారు దురా
లాపములాడుచును బోయిరానమయ
మునన్.

పెద్దనచే నాంధ్రకావ్య మాతృకయైన మనుచరిత్ర రచియింపఁబడినపిమ్మట తదనుసారముగ మొదట నితఁడు రచియించినది యీ గిరిజాకళ్యాణమై యుండును. కావ్యరచనయందు పూర్వకవులు దొక్కిన మార్గములు ద్రొక్కనిచ్చ లేనివాఁడై

మ. ఇటమున్గారుడసంహితాది కృతు
లీవింపొందగా జెక్కిన
ట్టిటులవిన్నారము చెప్ప నేల యవి
సంస్కృతోక్తి ఛాయల్లెమవం
ఘటనన్ రాఘవపాండవీయకృతి
శక్యంబే రచియింపంగ ని
చ్చటనెవ్వాటికి నీకె చెల్లెనది
భాషాకావ్యముం జేయుమన్.

అను పద్యమున గారుడ సంహితాదులయుం దొక్క గొప్పదవముంచక యపూర్ణమైన రాఘవపాండవీయమును గొనియాడి యదివఱకు నాంధ్రమున లేని కథాకల్పనగల కళాపూర్ణోదయమును కృతినిమ్మని నంద్యాలకృష్ణరాజు దన్నడిగినట్లు కళాపూర్ణోదయావతారికయందు సూరకవి చెప్పుకొనియున్నాడు. కాబట్టి రాఘవపాండవీయమునకు బూర్వము రచియింపఁబడిన తన గ్రంథములను ప్రచురించుటయం దిచ్ఛ లేకుండుటచేత నవి యంతరించినట్లూహించెదను.

ఉ. ఖీమన తొల్లి చెప్పినను
బెద్దలమాటయె కాని యందు నేం
డేమియు నేయెడ న్నిలుచు
టెవ్వరు గావ రటుండనిమ్ము నా
నామహిత ప్రబంధరచ
నా ఘనవిక్రతి నీకుగల్గుటన్
నామది తద్వయార్థకృతి
నై పునియుం గలదంచు నెంచెదన్
రాఘవపాండవీయము.

పై పద్యమునఁ జెప్పబడినట్లు పూర్వము భీమన రాఘవపాండవీయమును రచించినట్లు వాడుకయే కాని యది సూరకవి నాటికే నామావశిష్ట మయినది. లేక యది మొదట పూర్తికానే లేదేమో. వేములవాడ భీమకవి మొదలు సూరకవి వఱకును ద్వ్యర్థి కావ్యరచనకు బూనుకొనినవారు లేరు. కాబట్టి యిది యిక్కవి యం దొక్క యపూర్వ సామర్థ్యము కదా?

శా. రెండర్థంబుల పద్య మొక్కటియె
నిర్మింపంగ శక్యంబు గా
కుండన్ దద్గతి కావ్యమెల్ల నగునే
నోహాయనం జేయు దే
పాండిత్యంబున నందునన్ దెనుగు
కబ్బాః బన్నుతంబంద్రు ద
క్షుం డవ్వాడిల రామ భారతకథల్
జోడింప భాషాకృతిన్

అను పద్యమునఁ జెప్పఁబడినట్లు ఛందో నిబంధనలు సంస్కృతమునకన్న నధికమగుటచేత తెనుగుకవిత్వము కష్టము. అట్టి నిబంధనలకు లోబడి నిర్దిష్టములగు రెండాశయములతో బద్యము గూర్చుట కష్టతరము. దానం జేసియే కాబోలు సంస్కృతమందే సుబంధుఁడు దన శ్లేషకావ్యమును గద్యముగా రచియించెను. శ్లేషయందే కాదు; ఏకార్థమందైనను ఛందోనిబంధన వాక్ప్రవాహమునకు నిరోధకయాటంకమై యుండును. కాబట్టియె బాణుఁడును దండియు కల్పనా సరణులయందు వాక్ప్రవాహము గుంటులేకుండ ప్రవహించునని దమ కావ్యములయిన కాదంబరిని దశకుమార చరిత్రను గద్యములుగా రచియించిరి.

సీ. ఆంధ్రభాషా సంస్కృతాభి భాషాశ్లేష
యొక్కొక్కచోట నెక్కొక్కచోట
నవిరళశబ్దశ్లేష యొక్కొక్కచోట న
ర్థశ్లేష యొక్కొక్కతఱిని ముఖ్య
గాణవృత్తి శ్లేషఘటన యొక్కొకతఱి
నర్థాన్వయము వేఱయగుచు నునికి
శబ్దాన్వయ విభేదసంగతి యొక్కొక
తఱి నివి యొక్కొక్కతఱిని రెండు
గీ. మూఁడుఁ గూడుటయును సముజ్జ్వలముగాఁగ
నాకుఁదోచినగతిఁ బెక్కుబోక లలర
రామభారతకథలు బర్యాయదృష్టి
జూచు సుమతుల కేర్పడ నాచరింతు.

పై పద్యమునఁ జెప్పఁబడినట్లు అనేక విధములచేత సులువు లారసి సులభశైలితో రెండర్థములు వచ్చునట్లొనరించ నపూర్వ శ్లాఘాపాత్రమై పెద్దన ప్రయత్నమునకన్న నీతని ప్రయత్న మధికతర కష్టసాధ్యమును నధికతర జనాదరణీయమును నని నిశ్చయించ వచ్చునుగాని భావశాతనిపాటు యుపకార మీతనిది కాదని నా యభిప్రాయము. భావకు శ్లేష కవిత్వము వలన క్లిష్టతయు నిర్బంధమును నగుంగాని

శ్రమపడ దగిన రసము గానరాదు. అట్టి హేతువుచేతనే పెద్దనగారి శిష్యులతని కొమారుని కన్న చమత్కారముగా గవిత్వము జెప్పగలరని విని యాతనిభార్య శిష్యులయెద్ద "నాకొమారుడు భట్టుమూర్తి పాటు శ్లేషపద్యము లల్లుకొని బ్రతుకలేక పోలేడ"ని యుల్లసమాడెనట. అట్లీమహనీయుడైన సూరకవి యెడ యుల్లసమాడుట కాదు. ఈతడు శ్లేషకావ్యనిర్మాణమునకు మార్గదర్శియే యైనను నొక్క ద్వ్యర్థికావ్యమందే శ్లేషకు బాటుపడియెంగాని తక్కిన యీతని కవిత్వమం దెచ్చటను శ్లేష గానరాదు. ఆశ్లేష కావ్యమందైనను నన్వయక్లిష్టతగాని నునుపు దక్కువగాని నానార్థనిఘంట్వాధారమున మిక్కిలి శ్రమపడి సాధించ దగిన యర్థకాఠిన్యము గాని కానరాదు. ఈతని కావ్యమందైన యర్థసౌలభ్యమును జూడుడు. అర్థోచితముగ బదములను గాని వాక్యములను గాని పలసినపుడు విఱిచి చదువ నేయర్థమున కార్థమగును.

రాఘవార్థము

దశరథుడు మునిపుత్రుం గరి భ్రాంతిం దెగవేసినపు డనిన మాటలు

కం. ఏనుంగని కరమరయక
బూనితిగాక్కిట్టి మొదలపోనఁగునెయ్యేయుం
గానమె? కాల నియమగతి
తోనావేటమునియుగము ద్రుంగించెన్॥

భారతార్థము

పాండురాజు మృగమిథునభ్రాంతిని మునిద్వంద్వము నేసినపు డనిన మాటలు—

క. ఏనుం గని కరమరయక
పూనితిగాక్కిట్టి మొదలపోనఁగునెయ్యేయన్
గానమె కాల నియమగతి
తో నావేటమునియుగము ద్రుంగించెన్॥

ప్రథమాశ్వాసము

రాఘవార్థము

విశ్వామిత్రుడు రాముని దన యజ్ఞావనము నిమిత్తమున దశరథు కడకు వచ్చునప్పటి కథపట్టు.

చ. మనుజవరుండు నష్టనమమం
ఘటియిల్లెడు విఘ్న వాత్రప
ర్తనలు గురుప్రవృత్త విహితం
బులు సేయుచు, రామ, యేక్రియన్
నినువిడ నేర్తువంచు గను
మ్మొఁ గవుంగిటఁ జేర్చియంతటన్,
దనయ మవాంఛఁడించి తగ
దన్ని తదర్థఁ గృతార్థగామునిన్॥

భారతార్థము

పాండురాజు శాపభయమును వలను సేయక మాద్రితో సంభోగించు కథపట్టు—

చ. మనుజవరుండు నష్ట నడుమన్
ఘటియిల్లెడు విఘ్నవాత్రప

సూచింపుము. ఆనానార్థమున వాక్యమును గాని శబ్దమును గాని విఱిచి పఠించునపుడు వేఱర్థమున కానార్థముగున్ గాని తెలుపుగ బదములకు నానార్థముల నునుక నవసరము లేదు. చాలవఱకు లలితశైలి శ్లేషయందిట్లే యుండును. ఈతనికిముందు శ్లేషకావ్య మాంధ్రమున నామమాత్రముగుటంబట్టి భీమన శ్లేషకావ్యము లేదనేయూహించవలెను. పూర్వ బాణ సరస్వత్యాదుల కావ్యము లేవియు నాకు లభించినవికావు గాని పండితాభిప్రాయమును బట్టి రాఘవపాండవీయమునంత ప్రశస్త శ్లేషకావ్యము మన యాంధ్రమున లేదని నిశ్చయించవచ్చును.

ఈతనికి సమకాలీనుఁడయిన రామరాజభూషణు నంత శ్రమమును శ్లేషకవిత్వమందు మఱియొకఁడు జైకొనినరాదు. ఆతఁడును సుప్రసిద్ధుడైన శ్లేషకవి యంటకు వసుచరిత్రయే నిదర్శనము. కావ్యాలంకార సంగ్రహ కర్తృత్వము విషయమై పండితుల యభిప్రాయము భిన్నము గనుక నది గోడమీద పిల్లివలె యుండుగాక. ఈ రామరాజభూషణుఁడే హరిశ్చంద్ర నలోపాఖ్యాన మనుద్వ్యర్థి కావ్యమును గూడ రచియించెను. కాని, శ్లేష సూరకవికి లొంగినట్లు రామరాజభూషణునకు లొంగలేదు. ఇరువురి శ్లేషకావ్యములనుబరిశోధించి చూచినయెడల శ్లేషకవిత్వమందు రామరాజభూషణునకు నధికముయినను నిర్మలవిబుద్ధికివలె నిర్మలబుద్ధికి శ్లేషమందు శబ్దగ్రహణాప్రావీణ్య మంతి నిసర్గమయినది కాదు. అయినను సాధకాధిక్యముచేత నాతఁడు శ్లేషనాభిమాని కనుగుణముగఁ జైకొని యేకార్థకావ్యమందును శ్లేషకే పాలుపడియెను. ఏకార్థకావ్యములను బట్టిచూడ నితఁడు శ్లేషకవియైనట్లు కానరాదు. అతఁడు శ్లేషప్రయోగభరితమైన వసుచరిత్రమును రచించిన పిమ్మట హరిశ్చంద్ర నలోపాఖ్యానమును రచించెను. ఈతఁడు ప్రబంధమునసే శ్లేషకావ్యరచన కారంభించెను. ఇంతియేల? పిమ్మట శ్లేషకవిత యాతని స్వప్రయత్నముగ వరించెను. అది యాతని కతి ప్రయత్నసాధనమున లోబడియెను.

మ. అవనీభర్త విమాత నాతనుపతా
కాలోక సాంద్రేక్షణీ
యవిలాసంబు గజేంద్ర మత్త గమనో
దారంబు కాశ్మీర వ
స్త్రవిచిత్రంబు తయిద్విభాసి రుచియా
తద్వ్యాహనీభూతి వై
భవముల్ లో వెలిగాంచు చుర్ణజవిమెపం
పత్పేటికిన్ బేటికిన్.

వసుచరిత్రము

చ. సకల విశేషశోధనముఁ
జాలిన సూనశరాణపత్రనా
భకులి వతిఁసనత్నము ప్ర
భావతి పోహితకంటకంబు తా
వకమగు పూవు నావము ప్ర
వర్ధిత రాగతబర్హ్యాగాన త

త్యకలాపవృత్తి నానుకృతి
మించియు నేమని శ్లాఘింతునటుల్.

గీ. నీకు నామీఁద గలయట్టి నెయ్యమును మ
హాదరము నీవు పనివిన మాటచెప్ప
నాస్యలో ననవాంత నాట్యప్రపంక
మునః నుభజించు నేడుక ఘనము నాకు.

క. వను నేలిగాను నవశ్యం
బును నీయాశీగమంచిత్తమున నొక్కగనే
నొనరింతు నేటితమిని
మానమున నెంతయు నిషకొని మన్నింతు వగన్.

(ప్రభావతీ ప్రద్యుమ్నము)

ఏకార్థకావ్యమందైన నుభయముల శ్లేషలునునారయుము. రామరాజభూషణుఁడు బాలపట్టకు శబ్దశ్లేషయందు దలవాటు పడియున్నాడు. సూరకవి శ్లేషం దెచ్చుటకు సులువెట్లగు నక్లై కడలేను. ఏకార్థ కావ్యమందు ప్రస్తుతశ్లేష కెప్పుడును సూర కవి ప్రయత్నించినట్లె కనపడదు. కేవలము శబ్దశ్లేషమీద రెండర్థములు దెచ్చుట యెప్పుడయినను జిక్కగాని సులభముకాదు. శబ్దశ్లేషయందలవాటు విశేషముగ నుండుటచేత ద్వ్యర్థికావ్యమందు రామ రాజభూషణుని పాకము సూరకవి దాని కన్న కఠినముగ నుండుటను చూతుము;

ఉ. అతుణదావివర్ధన శ
రాన్వయుదక్షుద శాకయుంచు న
త్యశ యశోభమాన వచ
నాకలనా వణితాత్మ భూతియై
శిక్షిత వాజిరత్నగధ
సిధుగ కోటులతో నాసంగవి
శ్వాక్షితి నైభవం బతని
శక్తి ప్రాభవ ముద్రగాంచుచూ.

హారిశ్చంద్రనలోపాఖ్యానము

సంపూర్తిమందైనను శ్లేషావసరమున దశరథ పదములు వినుపునే రెండర్థములు దాఁక్రుట సులభము గాని విశేష నానార్థపదముల చేఁ జూపుట సులభముగాదు. నైషధమున నల పదముగను నింద్ర పరముగను జెప్పఁబడిన శ్లోకమును జూడుడు.

సేనాంచకిభపదిభాసన దానవారి
వాసేన యస్యాజనితా సురభీ రణశ్రీః

ఏయింద్రుని రణలక్ష్మి సేనయందు సంచరించుచున్న గజాననుని యొక్కయు దానవారియగు విష్ణునియొక్కయు నునికిచేత నసురలకు భయంకరముగుచున్నదో,

ఏనలునియొక్క రణలక్ష్మి సేనయందు గ్రుమ్మరు నిభములయొక్క ముఖములయందైన మదజలముయొక్క యునికిచేత పరిమళముగలదగుచున్నదో

పోనింక. ఏకార్థకావ్యమునందైన శ్లేషకేమి? హరిశ్చంద్ర నలోపాఖ్యానమునందలి యీ క్రింది పద్యములను విలోకింపుము.

సీ. అతఁడు విశ్రుతబలుండై చక్రవర్తుల
యం దాదిపినుతుండై యాతనులక్ష్మి

కథను సంక్షేపించెంగాని కథాక్రమమును తప్పలేదు. సూరకవి కావ్యమందొకయర్థమున పాఠమున రెండవదానికన్న నొక్కడనో యొక్కొకచోట స్వరభేదముండును గాని వర్ణభేదమచ్చటను గానరాదు.

శా. వేయుంజెప్పెడి దేటికి మానివర ప
ద్యోత్తంబుచే నేమిటం
జేయున్రాము పితృప్రమోదనుత
శ్రీసత్క దల్పా ప్రతిష్ఠి
ధీయుక్తిం దగు నెంతు క్రోవ గల
దేవిన్ వేదికన్ వేసర
న్యాయాంభోధి ఘటోద్భవు నాకుమునుల
వ్యాహారిన్ వర్తిలన్.

రాఘవపాండవీయము

ఇందు దేవరన్యాయాంబుచే నొక యర్థమున దేవర న్యాయాంభోధి యనియు రెండవయర్థమున దేవర న్యాయంబోధి యనియు నించుక స్వరభేదముగా నర్థముల సమన్వయించుటకు పరిగణించవలసివచ్చినది. ఇట్టియు నచ్చటచ్చట నొక యర్థమునగల సిద్ధఖండానుస్వారము గాని సాధ్యఖండానుస్వారముగాని రెండవయర్థమున దొలంగుచుండును. అటులనే నొక యర్థమునగల రేఫము రెండవయర్థమున అకారముగా మారుటయుం గలదు.

క. శ్రేయమున గుర్వర్థ
ర్ధాముల కీర్తోపర తెరుబాటకదం
బామితవర్గము దుసర
మై నెఱసెద ద్రభేద్యతైయె నిఱంతన్

రాఘవపాండవీయము

ఇందొక యర్థమున సాధువు గాని విక్రమము మాత్రము గానవచ్చుచున్నది. ఇట్టి స్వల్పభేదములు మాత్రము గాక నరుదుగ గైకొనియెను. కథ నెంతసంక్షేపించినను క్రమభంగము గాని రామాయణ భారతములకు విరుద్ధములైన కథాంశములు గాని యుందు గానరావు. హరిశ్చంద్రనలోపాఖ్యానములో నర్థములను సమర్థించుటకై పూర్వగ్రంథములకు విరుద్ధములైన కథాంశములు క్రొత్తగ కల్పింపఁబడినవి. ఈతండు కథాసందర్భమును లేశమైన దప్పక సులభశైలిలో రెండర్థములు సమముగా వచ్చునట్లు వ్రాసెను. అతఁడర్థసమర్థనకై యితనికన్న నధిక స్వాతంత్ర్యము గైకొనియు నితని యంత సులభముగా శ్లేషం బ్రతిపాదింప లేకపోయెను.

ఇదియునుగాక సూరకవి భారత రామాయణకథలలో వచ్చువారి నామములను బద్యముల నెంత సులభముగ నుభయకథలకును సందర్భోచితముగ నిమిడించెనో రామరాజభూషణుఁ డెంత శ్రమతో హరిశ్చంద్రనలకథల వచ్చు పురుషనామముల జేర్చి యర్థములను సమన్వయించెనో విలోకింపుము.

క. భూకాంతు నున్నవలు గడు
జేసుదు నామాదిత బుధ రసితధరతుం
గైక మహావీరత్వా

# కయఫియ్యతు తాలూకే అన్నాపల్లి సర్కారు కళింగ



యీ అన్నాపల్లి సంస్థానాధిపతి నల్లమందు పాయకరాయుడు అతని బిరుదులు యేమంటే—భోగేశ్వరస్వామి యితన్కి ప్రత్యక్షం. యితణ్ణి నవాబులుగాని పూన పాటివారు గాని యుద్ధానికి మద్దతురమ్మని ఖబురు పంపిస్తే ధేరాలు యివతల వేయించి స్వామివారు యెంపట్కి శెలవు యిస్తారో నాట్కి ప్రయాణం కూచీ చేశేదిగాని అది పరియంతరం వెళ్ళేది లేదు—యితని భోజనపు సొగసు యేమంటే—పగలు నిద్దర. ఆహారం పావుశేరు పంచదారానున్ను శేరు పెరుగూ కూడా కల్పి పుచ్చుకునేది. పగటి ఆహారం యిది. రాత్రి భోజనాన్కి కూచుండంటే అప్పుడు మాల్మి య్యతు యావత్తూ విచారిస్తూ ప్రసంగాలు చేస్తూ వుండేది. ఆ సమయంలో తనవద్దికి వచ్చిన గృహస్తులను బంధువులను మీయింట్లో యేమికూర చేశినారని అడిగి వారు చెప్పిన ప్రకారం కూరలు వండివుంటె సరే। లేనిపక్షాన్కి ఆ వస్తువ తెప్పించి అప్పుడు వండించి పచనం అయ్యే పరియంతరం భోజనందగ్గిర కూర్చుండి వుండి పుచ్చుకునేది. అది పుచ్చుకునేటప్పట్కి—యింతలో యెవరు అయినా వచ్చి మరియొక వింతకూరగాని మాంసంగాని చెప్పితె అప్పుడు వండుమని అంత పరియంతరం మామ్లి య్యతు చేస్తూ భోజనం చేస్తూ వుండేది. యీ ప్రకారంగా రాత్రి మూడు ఝాములు పరియంతరం భోజనం చేస్తూ లేచేవర్కు తెల్లవారవచ్చును. అప్పుడు నల్లమందు వేస్కొని తిరుగా పరుకుండంటే మూడు ఝాములుకు లేచేది. యింత నిద్రమైకంగాను వుండి పనివచ్చినప్పుడు తనశరీరం తాను యెరగడు. బహు ధర్మపరిపాలనం చేశేవాడు. ఆ స్తలంలో నియోగులు వైదికులు వేపాలు మొదలుకొని యింకా అష్టాదశవర్ణపు ప్రజలు బహు సుఖపడేవారు. యీ జమీదారుణ్ని రెండు వేల ఫంజు కొల్చేది. మహారాష్ట్రిలు దేశంలోకి వచ్చినప్పుడు విజయరామరాజు వడ్డాది తాలూకాలో తుమ్మలపాల అనే గ్రామందగ్గిర వారిచాత తగిలి ప్రయాసపడుతూ వుంటే ఆ మద్దతున యీ పాయ్కరాయనింగారు యేనూట్కి బోయంబంట్రోతులను యేనూట్కి తెలగాలను వెంటనే తీస్కొనిపోయి మహారాష్ట్రిలతో యుద్ధంచేశి రాజుగారిని విడిపించుకొని వ[illegible]నారు. అటువంటి శూరుడు. యీ[illegible] పోయిన వెనుక యీ సమస్తానంకు [illegible]లేనందున వీరికి జ్ఞాతి అయిన వ[illegible] రామభద్ర పాయకరాయనింగారు

*Reg. NO. M.*

**1885**

# ప్రకటన



## మేలైన మజిలీన్లు

ఎండకాలమునకు శ్రీకాకుళం మజిలీన్లు వాడుడు. తాను 12 గజములు. శిల్కువంటిది. దొరలు మిక్కిలి ప్రేమతో వాడుదురు. 6 కమీజులగును. రు 7—8—0 లు మాత్రం. తయారు కమీజులు డజను రు 17—0—0 లు. శాంపిలు కమీజులు మూడు రు 4—8—0 లు. సీమకసులములవంటి శ్రీకాకుళం పుష్యరాగములు 14 రాళ్ళు శెట్టు రు 10—0—0 లు. 72 పలుకలు కట్టించినవి. డిటో క్రొత్త కెంపులు రోజారంగు 7 క్యారట్లు రు 3—8—0 లు.

A. S M. CHETTY,
Chicacole.

---

## ఆంధ్ర సర్వస్వ కార్యాలయమున వెలకుదొరకు గ్రంథములు



పూసపాటివారి వంశచరిత్ర వెల రు **0—10—0** లు.

పూర్వశాసనములు (ELLIOTCOLLECTIONS) మొదటిభాగము రు **0—12—0** లు.